# సదాశివ సమారంభాం


గురు దక్షిణామూర్తి


గురు వేదవ్యాస మహర్షి


గురు శుక మహర్షి


గురు నారద మహర్షి


గురు వాల్మీకి మహర్షి


గురు శ్రీకృష్ణ

# శంకరాచార్య మధ్యమాం


గురు దత్తాత్రేయ


గురు బాబాజీ


గురు గౌతమ బుద్ధ


గురు ఆదిశంకరాచార్య


గురు రామానుజాచార్యులు


గురు జ్ఞానేశ్వర్


గురు రవిదాస్


గురు కబీర్ దాస్


గురు చైతన్య మహా ప్రభువు


గురు నానక్


గురు రాఘవేంద్ర స్వామి


గురు వీరబ్రహ్మేంద్ర స్వామి


యోగి వేమన

# అస్మదాచార్య పర్యంతాం


గురు త్రైలింగ స్వామి


గురు లాహిరి మహాశయ


గురు రామకృష్ణ పరమహంస, అమ్మ శారదాదేవి


గురు వివేకానంద


గురు సాయి బాబా


గురు అరబిందో


గురు రమణ మహర్షి


గురు యోగానంద


గురు భక్తివేదాంత ప్రభుపాద


గురు మళయాళస్వామి


గురు విద్యాప్రకాశానందగిరి


గురు చంద్రశేఖర పరమాచార్య

# వందే గురుపరంపరాం..





నన్ను "నేను" తెలుసుకోవటానికి

నన్ను "నేను" మార్చుకోవటానికి

"నేను" గా ఉండటానికి

మరియు అత్యుత్తమ జీవన విధానానికి

కావలసిన భక్తి,జ్ఞాన,కర్మ,ధర్మ సమాచారం ఒకేచోట తెలుగులో ఉచితంగా!

సాధారణంగా వేదాంతం తెలుసుకోవాలనే కోరిక వుంటుంది, కాని గ్రంధాలు అందుబాటులో లేవు. ఇంకొకరి దగ్గర గ్రంధాలు వుంటాయి, కాని జిజ్ఞాసువులకి ఎక్కడ ఉన్నవో తెలియదు. అలాగే కొన్ని లైబ్రరీ లో కొన్ని రకాల పుస్తకాలు మాత్రమే లభ్యం అవుతున్నాయి. కనుక తమవంతుగా భక్తి,జ్ఞాన ప్రచారార్ధం మహానుభావులైన **ద్వారకాదీష్ వాస్తు** వెబ్ సైట్ వారు ఉచితంగా విలువైన గ్రంధాలను ఆన్ లైన్ ద్వారా eBOOK(PDF) రూపంలో అందిస్తున్నారు. వారు చేస్తున్న జ్ఞాన యజ్ఞానికి సాయి రామ్ కూడా తమవంతుగా సహాయం చేసే కార్యక్రమంలో భాగంగా వారి గ్రంధాలను సాయి రామ్ ద్వారా కూడా అందచేస్తున్నాము, ఇందుకు మేము వారికి కృతజ్ఞత తెలియచేసుకుంటున్నాము. కనుక ప్రతి ఒక్కరు ఈ సదవకాశాన్ని సద్వినియోగం చేసుకోగలరు. ఇందుకు సహాయం చేసిన ఆర్కైవ్ వెబ్ సైట్(https://archive.org), గూగుల్ వెబ్ సైట్(https://www.google.co.in),మైక్రోసాఫ్ట్ సైట్(http://www.microsoft.com) వారికి కూడా మేము ఋణపడివున్నాము. సాయి రామ్ సేవక బృందం కోరుకొనేది ఒక్కటే, ప్రతి ఇల్లు ఆధ్యాత్మిక జ్ఞాన గ్రంధాలతో నిండిపోవాలన్నదే మా కోరిక.

ఈ గ్రంధాలను ఉచితంగా ఆన్ లైన్ లో చదువుటకు, దిగుమతి(డౌన్లోడ్) చేసుకొనుటకు గల మార్గాలు:

1) **ద్వారకాదీష్ వాస్తు** వారి వెబ్ సైట్: http://dwarkadheeshvastu.com
2) సాయి రామ్ వెబ్ సైట్: http://www.sairealattitudemanagement.org
3) సాయి రామ్ గూగుల్ సైట్: https://sites.google.com/site/sairealattitudemanagement
4) ఆర్కైవ్ వెబ్ సైట్: https://archive.org/details/SaiRealAttitudeManagement

ఈ జ్ఞాన యజ్ఞం పై గల సలహాలు,సూచనలకు సేవక బృందాన్ని సంప్రదించుటకు: sairealattitudemgt@gmail.com

సాయి రామ్ భక్తి,జ్ఞాన సమాచారం: https://www.facebook.com/SaiRealAttitudeManagement

సాయి రామ్ భక్తి,జ్ఞాన సంబంధ వీడియోలు: https://www.youtube.com/user/sairealattitudemgt

ఈ జ్ఞాన యజ్ఞంలో ప్రతి ఒక్కరు పాల్గొని, ఈ అవకాశాన్ని సద్వినియోగం చేసుకొని,మీరు సంతృప్తులైతే మరొక సాధకునికి, జిజ్ఞాసువులకు మార్గం చూపించగలరని ఆశిస్తున్నాము.

గమనిక: భక్తి,జ్ఞాన ప్రచారార్ధం ఉచితంగా eBook రూపంలో **ద్వారకాదీష్ వాస్తు** వెబ్ సైట్ వారు అందించటం జరిగింది. ఈ గ్రంధముపై వ్యాపార,ముద్రణ హక్కులు వారికి గలవు,కనుక వారిని సంప్రదించగలరు.

**SaiRealAttitudeManagement(SAI RAM) - సాయి నిజ వ్యక్తిత్వ నిర్వహణ(సాయి రామ్)**

* సర్వం శ్రీ సాయి నాథ పాద సమర్పణమస్తు *

ద్వారకాదీష్ వాస్తు వారి వెబ్ సైట్:

http://dwarkadheeshvastu.com

Free Download Indian epic ×

dwarkadheeshvastu.com/Epic-List-of-Indian-Epics-in-Telugu.aspx

Hindi | Sanskrit | English | Gujrati | Bangali | Oriya | Telugu | Nepali | Marathi | Kannad | Asamiya | Urdu | Malyalam | Avdhi | Ved | Puran | Bhagwat | Ramayan | Geeta | Punjabi | Jain Dharm | Islam | Karm Kand

Dwarkadheesh Vastu

Home
Contact Us
हिन्दी वेबसाईट
Vastu Consultancy
Download Vastu Book
FREE Astrology Books

FREE Devotional Music (Mp3)
FREE Devotional Videos
FREE Devotional Books (PDF)
FREE Educational Books (PDF)
FREE Educational Videos
FREE Devotional Wallpapers

Dwarkadheesh Vastu
Like
3,663 people like Dwarkadheesh Vastu.
Facebook social plugin

A | B | C | D | E | F | G | H | I
J | K | L | M | N | O | P | Q | R
S | T | U | V | W | X | Y | Z

1. 12 Rashi Fal (Hindi)
2. 300 Saal Sikh Itihaas De Naal (English)
3. Aachar Manjari (Nepali)
4. Aadarsh Bhakti Prem (Telugu)
5. Aadarsh Dampatya Jeevan (Telugu)
6. Aadarsh Desh Bhakt (Hindi)
7. Aadarsh Manav Hridaya (Hindi)
8. Aadarsh Nari Sushila (Bengali)
9. Aadarsh Nari Sushila (Gujrati)
10. Aadarsh Nari Sushila (Tamil)

## Indian Epics in Telugu

1. Aadarsh Bhakti Prem (Telugu)
2. Aadarsh Dampatya Jeevan (Telugu)
3. Aadarsh Nari Sushila (Telugu)
4. Aadhyatm Ramayan (Telugu)
5. Aandhra Mahabhagwat Dasham Skandh (Telugu)
6. Agni Puranam (Telugu)
7. Aladdin Adbhutha Deepam (Telugu)
8. Alibaba Dongalu Katha (Telugu)
9. Amavasya Somavara Vratham (Telugu)
10. Amma Neeti Kathalu Katha (Telugu)
11. Amulya Samaya Ka Upyog (Telugu)
12. Anantapadmanabha Asthotram (Telugu)

# అతి విశిష్టం ఈ దానం!

"దానాలలోకెల్లా ఆధ్యాత్మిక విద్యాదానం చాలా శ్రేష్ఠమైంది! దాని తరువాతిది లౌకిక జ్ఞానదానం, ప్రాణదానం, అన్నదానం" అని వ్యాసమహర్షి చెప్పారు.

మన ఆధ్యాత్మిక జ్ఞానం భారతదేశ హద్దులలో నిలిచి పోకూడదు. లోకమంతటినీ ఆవరించాలి! ఇలా లోకవ్యాప్తమైన ధర్మప్రచారాన్ని మన పూర్వులు చేశారు. హైందవ వేదాంతం ఎన్నడూ ఈ దేశం దాటి పోలేదని చెప్పేవారూ, మతప్రచారార్థం తొలిసారిగా, పరదేశాలకు వెళ్ళిన సన్యాసిని నేనే అని చెప్పేవారూ, తమ జాతిచరిత్ర నెరుగని వారే! ఇలాంటి సంఘటనలు ఎన్నోసార్లు జరిగాయి. అవసరమైనప్పుడల్లా, భారతీయ ఆధ్యాత్మిక జ్ఞానప్రవాహం వెల్లువలా లోకాన్ని ముంచెత్తుతూ వచ్చింది.



రాజకీయ ప్రచారాన్ని రణగొణధ్వనులతో, యోధులతో సాగించవచ్చు. అగ్నిని కురిపించి, కత్తిని ఝళిపించి, లౌకిక జ్ఞానాన్నీ, సంఘనిర్మాణ విజ్ఞానాన్నీ విరివిగా ప్రచారం చేయవచ్చు. కానీ ఆధ్యాత్మిక జ్ఞానదానం కళ్ళకు కనిపించకుండా, చెవులకు వినిపించకుండా కురుస్తూ, రోజా పువ్వుల రాసుల్ని వికసింపజేసే మంచులాగా నిశ్శబ్దంగా జరగవలసి ఉంది. భారతదేశం నిరాడంబరంగా, లోకానికి మళ్ళీ మళ్ళీ చేస్తూ వచ్చిన దానమిదే!

మిత్రులారా! నేను అవలంబించే విధానాన్ని తెలియజేస్తాను వినండి. భారతదేశంలోనూ, ఇతర దేశాల్లోనూ మన పారమార్థిక ధర్మాలను బోధించడానికి తగినవారుగా మన యువకుల్ని తయారు చేయడానికై భారతదేశంలో కొన్ని సంస్థలను నెలకొల్పాలి! ఇప్పుడు మనకు కావలసింది బలిష్ఠులు, జవసంపన్నులు, ఋజువర్తనులు, ఆత్మ విశ్వాసపరులు అయిన యువకులు. అలాంటి వారు నూరుమంది దొరికినా, ప్రపంచం పూర్తిగా పరివర్తన చెందగలుగుతుంది!!

ఇచ్ఛాశక్తి తక్కిన శక్తులన్నిటి కన్నా బలవత్తరమైంది. అది సాక్షాత్తూ భగవంతుని దగ్గరి నుండి వచ్చేదే కాబట్టి దాని ముందు తక్కినదంతా లొంగిపోవలసిందే. నిర్మలం, బలిష్ఠం అయిన 'ఇచ్ఛ' (సంకల్పం) సర్వశక్తిమంతమైంది. దానిలో మీకు విశ్వాసం లేదా? ఉంటే మీ మతంలోని మహోన్నత ధర్మాలను ప్రపంచానికి బోధించడానికై కంకణం కట్టుకోండి. ప్రపంచం ఆ ధర్మాల కోసమై ఎదురుచూస్తోంది. అనేక శతాబ్దాలుగా ప్రజలకు క్షుద్రసిద్ధాంతాలు నేర్పడం జరిగింది. వారు వ్యర్థులని ప్రపంచమంతటా బోధలు జరిగాయి. ఎన్నో శతాబ్దాల నుండి వారు ఈ బోధనల వల్ల భయభ్రాంతులై, పశుప్రాయులైపోతున్నారు. తాము ఆత్మస్వరూపులమనే మాటను వినడానికైనా వారెన్నడూ నోచుకోలేదు. "నీచాతినీచుడిలో కూడా ఆత్మ ఉంది. అది అమృతం, పరమ పవిత్రం, సర్వశక్తిమంతం, సర్వవ్యాపకమైనది" అని వారికి ఆత్మను గురించి చెప్పండి. వారికి ఆత్మవిశ్వాసాన్ని ప్రసాదించండి. ❖

మూలం: శ్రీ రామకృష్ణ ప్రభ - ఫిబ్రవరి 2014

పెడతారు. ఊరికినే నన్ను కోప్పడి—అనకేమో నేను మాటకుండా నాన్నకి పితూరి చెప్పుకుంటారు.

ఎందుకు చెప్పాలి! అందుకే నేను తరవాత కొప్పడేస్తాను. ఆ మేష్టరు ఇంక రాడు. తరవాత ఇంకో కొత్తవాడు.

మళ్ళీ నాన్న నన్ను కోప్పడతారు. రౌడీ రాస్కెల్ అటారు. మేష్టరు మాటలే అందరూ వింటారు.

అమ్మ నన్ను పోకిరీ వెధవా అంటుంది. ఒక్కోసారి వెధవకానా అంటుంది. బామ్మ అది పిడుగా అంటుంది. బామ్మ మంచిది.

నా అంతవాడు లేడు. నన్ను ఎవరూ తిట్టకూడదు. కొట్టకూడదు. కొట్టేతే పాపం, అసలు నేను చిన్నవాడిని, నా నెత్తిమీద దేముడుంటాడు. నన్ను కొట్టేతే వాళ్ళే కొట్టడం అన్నమాట.

నేను పెరిగింగా పెద్దవాళ్ళే అనుక్కో. అందుకని కొట్టొచ్చు. పోతే, వాళే నన్ను కుర్ర కుంక అంటారుగా. అందుకనే నన్ను కొట్టకూడదు, ఇదే నా అభిప్రాయం.

ఈ మాట బాబాయి నేర్పాడు. బాబాయి దగ్గర ఇవి చాలా ఉన్నాయి.

నా చదువు సమస్యలు. సమస్య అంటే కొత్త ప్రైవేటు మేష్టర్ని పెట్టడం. ఎవరూ రానంటున్నారట. అసలు ఇప్పుడు చదువూ సంధ్యా వద్దు అంటారు బాబాయి.

ఇది బాబాయి అభిప్రాయం. బాబాయి పెద్దవాళ్ళనాన్నడు. నాన్నకూడా. బామ్మ రోజా గంట వాయిస్తుంది.

బాబాయి మాట ఎవరూ వినరు. వేదికావు తో అంటారు. వాళ్ల కాలేజీలో ఓ అమ్మాయి ఉంది. ఫరవాలేదు బాగానే ఉంటుందనుకో. అది ఒక్కటే బాబాయి మాట వింటుంది. యస్ అంటుంది. యస్ అంటే ఇంగ్లీషు అన్నమాట. నాకు ఇంగ్లీషు ఇంకా బాగా రాదు. అయినా ఆ మాటలకి అర్థాలున్నాయి. ఎందుకుండవు? తెలియాలి అంతే. నాకు కోపం వస్తే జాటర్ ఢమాల్ అంటాను.




అది ఎవరికీ తెలియదు. నేను అలా అంటే నాన్న అక్కుపెధవా అంటారు. ఆ మాటకి అప్పుడు అర్థం లేదంటారు. ఎందుకు లేదు? ఉంటుంది. తెలియాలి, అంతే. జాటర్ ఢమాల్ అంటే అర్థం లేదా అని అర్థం అన్నమాట.

ఇది ఒక్క ప్రైవేటు మేష్టరుకే తెలుసు. ఆ మేష్టరుకి నేనేంచెప్పినా తెలుస్తుంది. తెలివిగల వాడన్నమాట. అందుకే వాడ్ని మానేశారు.

ఇప్పుడు కొత్తవాడు. వీడు మహాయితే పదిరోజా ఉంటాడేమోలే. చిన్నపిల్లల్ని (నేను కాదనుకో. నేను పెద్దవాళ్లు) ఎలా నేస్తం కట్టాలో, నేను సలహో ఇస్తాను. సలహా అంటే అభిప్రాయం, అంటే నాకు బాగా తెలీదు. బాబాయి నడుగు.

నా దగ్గిర పది మేష్టర్లు పనిచేశారు. వాళ్ళు చేసిన తప్పులు నాకు కంఠతావచ్చు. నా తొడమీద, వీపుమీద ఇంకా ఆ మార్కులు ఉన్నాయి. అందుకని కుంచెం సలహాలు ఇస్తాను. అప్పుడు పెంకిమేష్టర్లని ఏంచెయ్యాలో మంచిపిల్లలికి తెలుస్తుంది. మంచి పిల్లలికి ఎలా చదువు చెప్పాలో పెంకిమేష్టర్లకి తెలుస్తుంది.

అసలు ప్రైవేటు చెప్పడం అంటే తిట్టడం అని అర్థం. కొట్టడం అని కూడా అర్థం.

ఈ ప్రపంచకంలో ప్రైవేట్లు ఎన్నోరకాలు. ఎన్నిరకాలో నే చెప్పలేను. పది రకాలుంటాయేమో. ప్రైవేటు మేష్టర్లు కూడా ఎన్నోరకాలున్నాయి.

మొగ మేష్టర్లు, ఆడ మేష్టర్లు, కళ్ళజోడునీ, నల్లకోటునీ......ఇంకా గుండు మేష్టర్లు, పిలక మేష్టర్లూ (పూర్వకాలంలో వాళ్ళ ఈ రెండూ ఉండేవి. మేష్టర్లు కాదు, గుండూ పిలకానూ)

కొంతమంది చూట్టానికి అచ్చంగా ప్రైవేటు మేష్టర్లులా ఉంటారు. కాని నిజంగా కాదు.

కొంతమంది చూట్టానికి ప్రైవేటు మేష్టర్లులా ఉండరు. కాని నిజంగా అవును.

ఇంకుంచెంమంది చూట్టానికీ, నిజంగానూ ప్రైవేటు మేష్టర్లే. అలాగే కొన్ని మేష్టర్లు కుంచెం పాఠం చెప్తారు. కొందరు ఉత్తినే తిట్టుతారు.

మా ఇంట్లో బామ్మ, నాన్న, బాబాయి వీళ్ళు ఇంకోరకం ప్రైవేటు మేష్టర్లు అన్నమాట.

పొద్దున్నే అమ్మేమో బామ్మకి వంటికి కావలసినవి అన్నీ చప్పున ఇయ్యాలి. ఇయ్యకపోతే బామ్మ ఇలా కోపంగా మొహంపెట్టి అమ్మకి ప్రైవేటు చెప్తుంది.

అమ్మ నన్ను ఎప్పుడేనా కొడితే, నాన్న అప్పుడు అమ్మకి ప్రైవేటు చెప్తారు. నేను దెబ్బలాట అనుకున్నాను కాని, ప్రైవేటు అని బాబాయి చెప్పాడు.

మధ్యాన్నం అప్పుడు, బామ్మ ఒక్కోసారి అమ్మ బుగ్గమీద వేలితో పొడిచి నీ ఇల్లు బంగారంగానూ అని కోప్పడుతుందా; అమ్మ మాత్రం ఊరుకోదు. ఇలా నవ్వుతుంది. (అమ్మ అలా నవ్వితే భలే బావుంటుంది. నేను కూడా అలా నవ్వగలను). ఒక్కోసారి నాన్న ప్రైవేటు చెప్పినప్పుడు కూడా అమ్మ గారంగా నవ్వుతుంది.

ఓసారేమో నాన్నేమో, అమ్మ చెవి పట్టుకుని కీ ఇస్తున్నాడు.

ఇంతట్లోకి నాకు ఆకలేసింది. అమ్మా ప్రైవేటు అయిందా, ఆకలేస్తోంది అన్నం పెట్టుదుగాని అన్నాను.

అమ్మకి కోపం వచ్చింది కాబోలు. కాని అప్పటికింకా నవ్వు అయిపోలేదు. అందుకని రెండు తోటీ, "నీ పోటికి చెడవనా" అంది కోపంగానూ, నవ్వుతూనూ.




నాకు తరవాత బాబాయి చెప్పాడు. ప్రైవేటు చెప్పడం అంటే అన్నం పెట్టమనకూడదూ అని. ఇగో ఈ పెద్దవాళ్ళేం, ఎప్పుడూ ఏమిటో సరిగ్గా చెప్పరు. దీన్నే లోపం అంటారుట. ఇలా అని మనం అంటే మళ్ళీ కోపం.

ఇంతెందుకు, ఆ వేళ సాయంత్రమే బాబాయి నన్ను సావిట్లో కూర్చోపెట్టి ప్రైవేటు చెప్తున్నాడా, లెక్కలో ఏవో. అంతట్లోకి ఓ పెద్ద ప్రైవేటు మేష్టరులాంటాయన ఒచ్చాడు.



ఒచ్చి, నన్ను చూసి ప్రైవేటు చెప్పించుకుంటున్నావా బాబూ అన్నాడు.

నాకు ఒళ్ళుమండిపోయింది. పొద్దున్నేగదా ప్రైవేటు చెప్తున్నపుడు ఎవరూ వచ్చి మాట్లాడకూడదన్నాడు బాబాయి. పొద్దున్న అందుకనే అమ్మ నన్ను తిట్టింది కూడా. ఈ ప్రైవేటు మేష్టరులాంటి ఆయన చిన్నవాడా చితకవాడా. అందుకని నాకు ఒళ్ళు మండిపోయింది.

"ఏ పోకిరీ వెధవకానా" అన్నాను.

అంతే. ఇంకేం అనలేదుగదా. కాని బాబాయి మొట్టికాయ వేసేశాడు. అంతట్లోకే బామ్మవచ్చి అరే పిడుగా అంది. అమ్మ వచ్చి డిప్పకాయ వెధవా అంది. ఆ ప్రైవేటు మేష్టరు లాంటి ఆయన కూడా అరే చదవా అనేశాడు.

ఇంతవరకూ నా తప్పు ఏమిటో వాళ్ళు చెప్పలేదు. మేష్టరు అని అంటే దేముడు అని మాత్రం

ఒకటి: ప్రైవేటు మేష్టరు కొత్తగా ఒక కుర్రాడింటికి వచ్చేటప్పుడు ముందస్తుగా పాతమేష్టరు ఇంటికెళ్ళాలి. వెళ్ళి "ఇగో పాతమేష్టరూ పాతమేష్టరూ నువ్వు అల్ల వారిపిల్లడు ఫలానా బుడుగుని చెవి ఎలా మెలిపెట్టేవాడివి? ఎడంవేపుకా, కుడికా?" అని అడిగిరావాలి. లేకపోతే, ఫలానా నన్నే అడిగెయ్యాలి. అప్పుడు నేను చెప్తాను.

ఇంకోటి: కొత్త మేష్టర్లు కుంచెంరోజులేనా తలపాగా చుట్టుకురావాలి. ఎందుకంటే, కొన్నిసార్లు పెంకిపిల్ల ఉంటారు. గుండుమీద కొట్టుతారు. పెంకిపిల్లలేమిటిలే. ఓసారి నేనే అలా చేశాను ఒక మేష్టర్ని.

పది: చాక్లేట్లు తెస్తే యేం లాభంలేదు. వేడి పకోడీలు తెస్తే పిల్లలు మీ మాట వింటారు. (నన్నడిగితే, ఓ కబురు చెప్తా. మా ఎక్కువీధిలో నారాయణ కొట్లో పకోడీలు బావుంటాయి).

పదకొండు: పెద్ద పెద్ద మీసాలతో మా ఇంటి దగ్గిర నాగన్న అంత మీసాలతో చిన్న పిల్లలికి చదువు చెప్పడానికి రాకూడదు. కొందరికి భయం వేస్తుంది. ఇంకొందరికి, పాఠం విన్నా బుర్రకెక్కదు. ఉత్తినే అలా ఆ మీసాలవేపే చూడాలనిపిస్తుంది. మేష్టరు మాట్లాడినప్పుడు "విద్యుక్తేమిటి" (ఈ మాట ఎలా రాయడమో బాబాయి నేర్పాడు) లాంటి మాటలు అన్నప్పుడు మీసాలు తమాషాగా కదులుతాయి. అందుకు.




డజ్ను: మేష్టరు రోజూ రాకూడదు. ఓసారి తలనెప్పి అని, ఇంకోసారి జ్వరం అని (కడుపునొప్పి అనకూడదు – ఎందుకంటే, అది మేష్టరొచ్చినప్పుడు పిల్లలికి రావాలి) ఎగకొట్టాలి. అలాచేస్తే పిల్లలు నేస్తం అవుతారు.

వంద : ఇంకొక్కటి. ఈ ప్రైవేటు కోసం అని స్పెషల్‌గా వేరే గది ఇస్తే ఒద్దు అని చెప్పండి. నా మాట వినకపోతే మీకే నష్టం.

ఇంక పిల్లలికి కుంచెం చెప్తాను. ఇక్కణ్ణుంచి పెద్దవాళ్ళు – ముఖ్యంగా ప్రైవేటు మేష్టర్లు అస్సలు చదవకూడదు.

వన్ : ఇగో, ఈ మేష్టర్లున్నారే చూట్టానికి మంచి వాళ్లలా ఉన్నా, కుంచెం రోజులుపోయాకా కొట్టుతారు. అడుస్తే ఇంకా కొట్టుతారు. అందుకని అది ఇవ్వకండి.

ఏంలేదు ఒకటే ముందస్తుగా, ప్రైవేటుకి స్పెషల్‌గా ఓ గది కావాలని అల్లరి పెట్టాలి. అందులో కూర్చున్నాక, ఓ పావుగంట మామూలుగా ఉండుకోవాలి. మేష్టరు నచ్చితే సరి. లేకపోతే ఒక్కసారిగా, "బాబోయ్ మేము గిల్లేస్తున్నాడేవ్" అని గావిగ్ అరవడమే. వాడు వినంగా గిల్లడముకో. అయినా గిల్లినట్టు యాడవాలి. మీకు బాగా తెలుసుగా. అలాచేస్తే మా బామ్మా మేష్టరూ




వాడూ నా స్పీడుగానే పరిగెడతాడు. నా అంత స్పీడు కాదనుకో.

అయినా పట్టేస్కున్నాని కొట్టేస్తాడని అనుమానం కలిగింది.

అప్పుడు యింకో రోడ్లోంచి నిమ్మళం జటకాల పేటు కెళ్ళాను.

నాకు తెలీని వాళ్ళుంటారేమో చూద్దామని. తెలిసిన వాళ్ళ కన్న వీళ్ళే నయం. తెలిసిన వాళ్ళు నేను పిలిస్తే బండీ కట్టరు.

అక్కడ ఒక్కడే కొత్తవాడున్నాడు.

మా యింటికి రావోయ్ అని బండి కట్టించేసుకుని రయ్యమని ఇంటికెళ్ళిపోయి, పెరట్లో కెళ్లిపోయి జాం చెట్టెక్కి పోయాను.



తరవాత పెద్దవాళ్ళందరూ ఒకళ్ళకొకళ్ళు ప్రైవేట్లు చెప్పేసుకున్నారు. చివరికి నాన్నొచ్చి బాబాయికి గట్టిగా ప్రైవేటు చెప్పేశారు.

క్రాపింగు వాడికి కోపం పోయేలా డబ్బులిచ్చాడు. అంతేకాకుండా బాబాయి వెంటనే ఓసారి క్రాపింగు చేయించుకోవాలన్నాడు. బామ్మ కూడా అంతేకావాలంది.

బాబాయి ఒప్పుకున్నాడు. పెద్దషాపుకెళ్తే కాని ఫాషన్‌గా చెయ్యరన్నాడు.

పోనీ ఇప్పుడు కుంచెం క్రాపింగు చేయించుకుని అవాళ పెద్దషాపుకి వెళ్ళమంది బామ్మ. అప్పుడేమో ఆ పెద్దషాపుకి, ఈ బండిమీద వెళ్ళొచ్చునన్నాడు నాన్న.

కాని బండివాడు క్రాపింగు అయ్యేదాకా ఉండనన్నాడు. అంతట్లోకి క్రాపింగుషాపు వాడు అప్పుడు నేను క్రాపింగు చెయ్యను పొమ్మన్నాడు.

అప్పుడేమో వాళ్ళిద్దరూ నేస్తాలయిపోయారు. క్రాపింగు షాపింగు వాడు, బండివాడి జటకాలో ఎక్కిపోయారు. ఇద్దరూ ఆ బండిలో వెళ్లిపోయారు.

ఆవేళ, మాయింట్లో అందరూ కలిసి ఒక్కసారి నా గుండుమీద ప్రైవేటు చెప్పేశారన్నమాట.

కాని, ఎప్పుడూ తలపాగా పెట్టుకునే కనబడేవాడు నాకు. అందుకని ఆయనికి అలాంటి గుండు ఉందని తెలీదు నాకు. మా నాన్నకీ తెలీదు.

నాన్నోయ్! చూశావా, వీడిది బోడిగుండు! అన్నాను ఆశ్చర్యపడిపోతూ.









నాన్న పకపక నవ్వేశారు. నేనుకూడా నవ్వేస్తున్నాను. అంతట్లోకే ఆయన ఆ బుడుకుల్లోనే వెనక్కి తిరిగాడు. వాడు చాలా ఎత్తు నాన్నకన్నాను. నాన్న నన్ను ఎత్తుకున్నంత ఎత్తు.

ఏమిటా పొగరు? ఎందుకలా నవ్వుతారు అన్నాడు వాడు.

నా ఇష్టం, నీ గుండుచూసి నవ్వొచ్చింది అన్నాను నేను.

షట్ నీతో ఎవడు మాట్లాడాడు అన్నాడు వాడు.

నేను నీ అంత ఎత్తున్నాను నాతోనే మాట్లాడావు అన్నాను నేను.

ఇంతట్లోకే మా నాన్న షట్ ఊర్కోరా అన్నారు.

అప్పుడు ఎదురుగుండా ఉన్న గుండువాడికి ఇంకా కోపం వచ్చేసింది.

నన్ను చూసి నవ్వి, పైగా షట్ అంటావా అన్నాడు.

నిన్ను కాదు, మా అబ్బాయిని అన్నారు నాన్న.

నన్నే అన్నారు: వాడు కోపంగా.

వాడు మా నాన్నకి ప్రైవేటు చెప్పేస్తాడని నాకు అనుమానం వేసింది. అందుకని నిజం చెప్పేశాను.

యేయ్! అర్భీ మా నాన్న నిన్ను చూసి నవ్వారూ, నన్ను షట్ అన్నారూ అని చెప్పేశాను.

ఎందుకు నవ్వాలి? అంటూనూ అన్నాడు.

నేను నవ్వలేదు. వాడికే పిచ్చా అన్నాడు నాన్న.

నీకేం పనో నాకేం తెలుసు? నువ్వు నవ్వావు అంతే అన్నాడు వాడు.

మా నాన్నకి రెవిన్యూ బోర్డులో పని అని చెప్పా నేను.

నా మాట యెవళ్లూ వినలేదు.

నేను నవ్వలేదు అని అబద్ధం చెప్తారు నాన్న.

"నువ్వే నవ్వావు" అని నిజం చెప్తాడు వాడు.

ఎలాగా? అంతట్లోకి నాకు మొట్టికాయ సంగతి జ్ఞాపకం వచ్చింది. ఆ సందట్లో చటుక్కున ఒక్కటి కొట్టాను – వాడు అటుతిరిగి ఉన్నప్పుడు. ఆ వెనకాతల ఇంకో అబ్బి ఇంకో పిల్లాణ్ణి ఎత్తుకున్నాడు గదా. ఆ పిల్లాడు నన్ను చూసి కాపీకొట్టాడు. అంటే ఓ మొట్టికాయ కొట్టాడు.

అందరూ నవ్వేశాము. తరవాత యుద్ధం జరిగింది. దీనికంతా ఫలితం అయినకి గుండు వుండడమేగదా?

అలా అని పెద్ద క్రాపింగు ఉన్నా కష్టమేననుకో. గుండు ఉంటే ప్రైవేటు మేష్టరు ఒకదెబ్బ కొట్టేసరికి పారిపోవచ్చు. అదే క్రాపింగు ఉంటేనా. ముందస్తుగా జుట్టు గట్టిగా పట్టుకుని తరవాత చాలాసేపు చితక్కొట్టేస్తారు. ఒక్కోసారి ఇలా పైకి ఎత్తి పట్టుకుంటారు.



ఇందాకా చెప్పానే సంబరంలో సంగతి. అదేం నాన్న ఇంటికెళ్ళాకా కోప్పడ్డాడుగదా నా మీద.

ఎందుకు వాళ్లే రౌడీగుండు అవాలి అసలు? అంటూ. దానికి నిజంగా గుండు ఉందిగా అన్నాను నేను.

ఏడిశావు. రౌడీనిజం నువ్వొద్దను అని కసిరాడు నాన్న.

నాన్న ఇలా అనగానే ఎందుకో అమ్మకి నవ్వొచ్చింది.

వాడు చెప్పిన నిజం దాన్ని గురించే గదా అంది.

అప్పుడు నాన్నకి నిజంగా కోపం వచ్చింది. వేళాపాళా ఉండద్దూ నిజం చెప్పడానికి అన్నాడు.

ఇగో! నిజం చెప్పేస్తాను విను. నాకు ఇంత అనుభవం ఉంది గాని, ఈ నిజం అనేది ఎప్పుడు చెప్పాలో నిజంగా చాలా తెలీదు.

ఒక్కోసారి మా ఇంట్లో అమ్మ మినపరొట్టె చేస్తుందా ఆదివారంనాడు?

సరిగ్గా తినడానికి రెడీమైనప్పుడే కొందరు మీసాలవాళ్ళు నాన్నతో మాట్లాడడానికి వచ్చేస్తారు. ఎంతసేపటికీ లేచి వెళ్ళరు. నాన్న వచ్చేదాకా అమ్మ నాకు రొట్టె పెట్టదు. ఆ రొట్టేమో చల్లారిపోతోంది. ఎలాగా?

పాపం అమ్మ విసుక్కుంటుందికూడా. పోనీ వాళ్ళకి పెట్టుదామంటే, మేం ముగ్గురం గదా అని కుంచెంగానే చేసింది మరి.

"కబుర్లు చాలు ఇంక ఇళ్ళకి పొండి" అని గసురుదామనుకో – నా మాట ఖాతరు చెయ్యరు.

మినపరొట్టె చల్లారిపోతోంది. మీసాలవాళ్ళు ఎప్పుడు పోతారో అని నాలో నేనే (వాళ్ళకి వినబడేలా) విసుక్కుంటే, వాళ్ళు ఇలా మొహాలు పెడతారు. అనక నాన్న నన్ను పట్టుకుని మొట్టికాయలు వేస్తాడు. నిజం అయితే మాత్రం అప్పుడెందుకు చెప్పాలని. మళ్ళీ నవ్వుతాడు కూడా.



ఏ నోట ఏనాటిమాటలొచ్చాయమ్మా అంది మెల్లిగా.

అంతట్లోకే అమ్మ కళ్ళలోంచి మెల్లిగా నీళ్ళు వచ్చాయి.

అమ్మ ఏడుస్తోంది. మా అమ్మని నువ్వెందుకు కోప్పడ్డావు అని నాన్నని కోప్పడ్డాను నేను.

అబ్బే అమ్మ ఏడవటం లేదు. ఉల్లిపాయలు తరుగుతోంది కదూ. అందుకని అన్నారు నాన్న అమ్మకి కళ్ళు తుడుస్తూ.

కాని ఇక్కడ అస్సలు ఉల్లిపాయలు లేవ్గా!

ఇక్కడ ఉల్లిపాయల్లేవు అన్నాను నేను.

నాన్నకి కోపం వచ్చింది. నేను నిజం చెప్పినా సరే పో అన్నారు కోపంగా.



అందుకే నిజం ఎప్పుడు చెప్పాలో నాకు నిజంగా తెలిసొచ్చాను. నాన్నకేగనక నిజం ఎప్పుడూ చెప్పకూడదు.

ఎప్పుడూ అంటే, అస్సలు ఎప్పుడూ నిజం చెప్పకూడదని కాదు. అస్తమానం ఎప్పుడూ అని అర్థం అన్నమాట.

ఇప్పుడు నేనున్నానా, బాబాయి ఉన్నాడా. బాబాయీ నేను ఎప్పుడేనా అలా షికారు వెళ్తామా, అక్కడ ఇంకొందరు అక్కలు కూర్చొని ఉంటారా. అప్పుడు రెండుజడల అమ్మాయో, ఒక్కజెడల అమ్మాయో తొణ్ణుకుంటి నడిచి వెళ్ళిపోతోంది, గదా.

అప్పుడు ఈ బాబాయీ వాడి ఫ్రెండ్సూ ఈల వెయ్యాలిగదా. వాళ్ళకి పాపం రాదుగదా. అప్పుడు నన్ను ఈలవేసి పెట్టమంటారు.

నేను ఖయ్యుమని ఈలవేస్తా. నాకు బాగా వచ్చు. రౌడీలదగ్గిర నేర్చుకున్నానులే. రౌడీలు బీడీలు కాలుస్తారు. నేను కాల్చనులే. అయినా నా దగ్గిర కుంచెం వున్నాయి. జట్కాబండితోలినప్పుడు చెవిలో పెట్టుకోవాలిగా అందుకు.

బీడీలు ఇంకోందుకు కూడా మంచివి. అమ్మ కేప్పుడు బామ్మదగ్గిరికి వెళ్ళి మీద పడేస్తానంటే, కాణీ ఇచ్చేస్తుంది. అందుకు.

ఏం, అప్పుడు నేను ఖూంవేస్తే బాబాయిగారి ఫ్రెండుల్లా కలిసి, ఓ కాణీయో పైసాలో ఇచ్చేస్తారు. ఇప్పుడు నేను ఆ కాణీయో పైసాలో పట్టుకుని ఇంటికి వస్తావా. అమ్మ నా చేతులు తనిఖీ ఎక్కడిదిరా బుడుగూ కాణీయో పైసాలో అంటుంది. తనిఖీ అంటే చేతులు వెతికి కాణీలు లాక్కోవడం. అప్పుడు నేను ఆ కాణీ ఎక్కడిదో చెప్పాననుకో - కొట్టేస్తుంది. ఇంకెప్పుడూ అలాటి పని చెయ్యకేం బాబాయి చెడతావ్ అంటుంది. అందుకని ఓసారి నిజంచెప్పి మొట్టికాయలుతింటే, రెండోసారి నిజం చెప్పకూడదు.

అయినా యీ పెద్దాళ్ళకి అన్నీ గొడవలూ కావాలి. నేను మొగాణ్ణి గదా, వీధిలోకి వెళ్ళి కాణీ సంపాదించుకువస్తే ఎక్కడిది అని ఎందుకు అడగడం. ఎందుకు మనవేం అనవసరంగా నిజం చెప్పడం? మళ్ళీ కొట్టడంము? అందికే నాకు కోపం - అన్నీ గొడవలూ వీళ్ళకెందుకని.

అలాగే బాబాయి సీతకి లెటర్లు రాసినా వెళ్ళితే కావాలి. లెటర్లు అంటే నాకు తెలుసు. ఇవి బాబాయి దగ్గిర ఉంటాయి. బోల్డు ఉంటాయి. రాసి మళ్ళీ చింపేస్తాడు. మళ్ళీ రాస్తాడు.

ఏం, ఓసారి బాబాయి ఈ లెటరు (మామూలు కాగితానికి అచ్చు ఉత్తరంలా ఉంటుందిలే) నా చేతికిచ్చి, సీతచేతికిచ్చి రమ్మన్నాడు. నేను వెళ్ళేసరికి సావిట్లో సీత నాన్న కూర్చున్నారు. దానికెందుకు చెప్పు అన్నీ గొడవలూను.




ఎవరికిరా ఆ ఉత్తరం అన్నారు.
ఎవరికో నీ కెందుకురా అన్నాను నేను.

చదివా ఇలా రా అనేసి వాడు నన్ను గభుకుని పరేస్కున్నారు. వేలితో ఉత్తరం లాక్కు చూశాడు. చూసి హాఁ అన్నాడు.

హెం హొగను రాస్కెల్. నా కూతురికి ఉత్తరం రాస్తావా? చెప్తా ఉండు అన్నాడు వాడు.

లేకపోతే నీకు రాస్తారా అన్నాను నేను.

అసలు బాబాయి ముందరే చెప్పాడు. వాళ్ళ నాన్నకి చప్పినా ఇవ్వద్దని. మరి నీడు లాక్కున్నాడుగదా. ఎలా, నేను, మా నాన్న అందరూ కలిసి బాబాయికి ప్రెపేటు చెప్పేస్తారని నాకు అవమానం వేసింది. జాలికూడా వేసింది. నిజ్జమీద కాదు, బాబాయిమీద.

నేనొక్క అప్పుడు ఒకలా అనుకున్నా. బాబాయిని రక్షించాలని.

నేను ఇలా అందర్నీ బోల్డుసార్లు రక్షించాను. రక్షించడం అంటే కాపాట్టం. అంటే నాకు తెలుసు.



అబద్ధం చెప్తే ఎంత లాభం



ఏం, సీత నాన్న ఆ ఉత్తరం పెట్టుకుని దాం ద ం అనుకున్నాను కదూ. అది లాక్కు పారిపోవాలనుకున్నా. కాని అందదే, వాడు చాలా ఎత్తుగదా.

ఓ సారి నన్నెత్తుకోవా అని అడిగా.

ఛస్ పోస్కుయ్యా, నిన్నూ మీ బాబాయినీ కూడా పెటిక్కిరేస్తాను అన్నాడు. అప్పుడు నేను కొంచెం దూరంగా నిల్చున్నాను.

బాబాయిని రక్షించడం ఇంకెలా—

అప్పుడు ఇంకో ఉపాయం వచ్చింది. ఉపాయం అంటే అబద్ధం.

ఒరేయ్ సీత నాన్నా! మరేం, ఆ ఉత్తరం బాబాయి కాదూ. నేనే రాశా ఒట్టి అనేసి పరిగెట్టి వెళ్ళిపోయా.


ఇదిగో చూడు - రాత్రి వచ్చే సరికి కొంచెం ఆలస్యం అవుతుంది ఆఫీసులో అర్జంటు పనుందని మేనేజరు చెప్పాడు —


ఇదుగో – తొందరగా
తెములాలి మరి
ఆట మొదలెట్టేస్తారు
ఒక్క
నిమిషం
ఆలస్యం
చేశానాండీ ?


ఇప్పుడు నేను కలుపుకున్న దేనితో? - అహఁ -
మరేంలేదూ - రేపు డాక్టరు ఏంతిన్నావని
అడుగుతే చెప్పొద్దూ---
బాపు


అలాగే కాస్త పొయ్యి
మీద పాలు
పొంగుతున్నాయేమో
చూడండి


పొంగుతున్నాయి


అంత సందియమున్నత్తే ఎలాగండీ - మీరనూ -
ఇదిగోరి ఇక్కడుంది -


ఓహోహో దీపావళీ – ఆహా ఆనంద దీపావళీ!
ఓహోహో దీపావళీ – ఆహాహా దీపావళీ...
శంకర్
bapubomma.com


పక్కింటావిడ ఫిడేలడిగి తీసుకొచ్చారట- ఏం - మీకు వాయించడం రాదుగా-
ఫిడేలు మనింట్లో వుంటే ఆవిడా వాయించలేదుగా - అందుకని -


ఛీ! చప్పుడు చెయ్యకండి - పక్క వాటా
జంట మళ్ళీ ఘర్షణ పడుతున్నట్టున్నారు
కాస్త విననివ్వరూ


డాక్టరు గారూ- మా ఆవిడకి గొంతు నొప్పి
దవడ వాపూనూ - మాట్లాడితే వస్తోందసలు - మీకు
తీరికున్నప్పుడు - ఏ రెండు మూడు నెలల్లో - ఎప్పుడైనా
అటేపోవాల్సినప్పుడు కాస్త వచ్చి చూడండి-


ఉప్పు అద్భుతంగా సరిపోయింది.
ఎటొచ్చీ కూరే కొంచెం తగ్గినట్టుంది
శంకర్.

మాయింటా ఆడపిల్ల పుట్టడానికి కారణం - నేను - నేను అబద్ధాలు
చెప్తున్నాను - ఇలాంటివాళ్ళ వినాన్నమా - అక్కడికీ అందరూ చెప్పారు -
అబద్ధాలాడితే ఆడపిల్లలు పుడతారని - నన్ను - నన్ను
క్షమించావనమ్మా - ఏ-గానసేసుకుంటా - నమ్మా—...



ఇదిగో- చెప్పులో మేకు గుచ్చు
కుంటోంది గాని- ఆ పొత్రం రాయో-
పొద్దున్న చేసిన గారి ముక్కో
ఇలా పట్రా)-






శ్రోతలకొక్క మనవి.. అనివార్య కారణాల వల్ల ముందు ప్రకటించిన విధంగా శ్రీమతి ఆదిశక్తిగారే ఇప్పుడు పాడుతారు—
శంకర్
bapubomma.com


వస్తున్నానో బాబూ - వస్తున్నా -
వడ్డించెయ్ -


నీ మీద ఎవరో అప్పుడే
పుస్తకం కూడా రాసేశారు


ఇదిగో- చెప్పులో మేకు గుచ్చుకుంటోందిగానీ-
ఏదేనా రాయి ఉంటే ఇలా పట్రా-
మధ్యాహ్నం చేసిన మినపరొట్టె ముక్కయినా సరే-


మీరో కబంధుడే –
చేతుల్లేకుండా అల్లమన్నది –